శృంగార గ్రంథమాల-6

# శృంగార గాధేయోపాఖ్యానము



అనంతనార్య ప్రణీతము.



ప్రకాశకులు:
జి. ఎస్. శాస్త్రి అండు కో.
మద్రాసు.

శృంగార గ్రంథమాల-6

# శృంగార గాధేయోపాఖ్యానము

అనంతనార్య ప్రణీతము.



ప్రకాశకులు.
జి. ఎస్. శాస్త్రి అండుకో.,
మద్రాసు.

సర్వస్వామ్య సంకలితము.

ప్రథమ ముద్రణము.

లండన్ రాయల్ యెడిషన్

వెల రు. 1—0—0

చెన్నపురి:

కేసరి ముద్రాలయమున

ముద్రితము.

శ్రీవిజయనగర సంస్థానాస్థాన కవియును, ఆంధ్రగీర్వాణ భాషాభూషితులును కవిశేఖరులును ప్రియమిత్రులును అగు శ్రీభోగరాజు నారాయణమూర్తిగా రీ శృంగారగాధేయోపాఖ్యానమను ప్రాచీన గ్రంథరత్నమును, మా గ్రంథమాల తరపున ముద్రించి, ప్రకటించుటకుగాను దయతో నొసగినందున వారికి మాకృతజ్ఞతా పూర్వక వందనసుమము లర్పించుచున్నారము.

ఈగ్రంథమును సొంతముగా ముద్రించిన పిమ్మట దీనిమాతృక చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునగల దనివిని, దానిని పరిశీలించగ నది విశ్వామిత్రచరిత్రరూపకమగు అయిదాశ్వాసముల చక్కని ప్రబంధమయియుండెను. అందుమొదటి నాలుగాశ్వాసముల గ్రంథము చెదపురుగుల కాహారమై, శిథిలమై, చదువశక్యముకానిదైయున్నది. మేము ముద్రించిన అయిదవ ఆశ్వాస భాగము ప్రత్యేకముగ నొకగ్రంథమున వ్రాయ

బడియున్నది, గ్రంథమంతటి కిదియే రసవత్తర మగుభాగము. ఇదియే శృంగారరసతరంగితము. భాండాగారమునగల గ్రంథరాజముతో నీగ్రంథము సరిచూడబడియిందులేని భాగమును దాని నుంచిచేర్చి ముద్రించి ప్రస్తుతము దీనిని యాంధ్ర లోకమునకు సమర్పించుచున్నారము. మొదటినాలు గాశ్వాసములుగల గ్రంథము మంచిప్రతి లభించ గనేముద్రించి యాంధ్రమహాశయులకు సమర్పించ గలము. మాగ్రంథమాల శాశ్వత చందాదారు లందరు నితోధికముగ మాకు ప్రోత్సాహమొస గగలందులకు కోరుచున్నారము.

ఇట్లు.

గంటి. సూర్యనారాయణశాస్త్రి,

సంపాదకుడు.

5-4-29

శ్రీరస్తు

# శృంగార

# గాధేయోపాఖ్యానము

---

క. శ్రీనారాయణకరుణా
నానావిధవిహరణాభినంద్యజయశ్రీ
మానితవిభవోద్దామా
భూనుతగుణధామ కృష్ణభూపలలామా!

వ. అవధరింపు మద్దశరథనందనునకు। గౌతమ
నందనుం డగు శతానందుండు కుశికనందనుని
వృత్తాంతంబు మఱియు నిట్లని వినిపించె.

క. వరుణదిశాతటమునఁ బు
ష్కరములఁ బుణ్యప్రకాశి కౌశికుఁడు నిరం
తరముగ నిశ్చలుఁ డై య
ట్లురునిష్ఠఁ దపంబు సేయుచుండెడు వేళన్.

క. పరిచరితార్యుఁడు నయసు
స్థిరకార్యుఁ డగణ్యపుణ్యశీలుఁ డయోధ్యా
పురపాలుఁ డదోషుం డం
బరీషుఁ డొకయధ్వరంబుఁ బ్రారంభించెన్.

క. ఆజన్మంబునఁ బశువును
జేజేదార యపహరింపఁ జింతాకులుఁడై
రాజు దనపురోహితుతో
నీజన్నము సాగు టెంక నెటు లని పలుకన్.

క. విను రాజ! యేమి దుర్ణయ
మొనరెనొ నీకతనఁ గాకయున్నన్ జన్నం
బున కున్నపశువు గ్రన్ననఁ
జనునె యదృశ్యమయి సకలజనమధ్యమునన్.

క. నరపశువునఁ గా కీయ
ధ్వరంబు పూర్ణంబు గాదు ధరఁ దూర్ణముగా
నరపశువు నరసి నేర్పున
దొరఁకింపుము ధర్మయుక్తితోఁ బ్రజ మెచ్చన్.

వ. అని పురోహితుండు దెలిపి హితంబు నెఱప
నరపతియు నరపశుసాధనంబుగా ధనంబును
గోధనంబును నపరిమితంబుగాఁ గొని వెడలి
కడిమిం బుడమినలుగడల జనపదజనుల నడిగి
యడిగి యెయ్యెడం బడయనేరక మగిడి నడ
చుచు నొక్కెడఁ బుత్త్రత్రయవంతు బుచీకు
నిం గని తనచింతితంబు నుడివి యొకకొడుకు
నడిగిన నతఁడు పెద్దకొడుకును విడువ నొడంబడ

ననవుకు నతనిపకంతుకయుం గడపటికోడు
కును విడువ నోడంబడ ననవుడు నడిపి కోడు
కగు నాశునశ్శేపుం డాభూపాలున కిట్లనియె.

క. జనకుం డగ్రజు విడువఁడు
జననియుఁ గడపటికుమారుఁ జాలదు విడువన్
విను మీయిరువురు విడిచిన
ననుఁ గొని పొమ్మధ్వరంబు నడపు మిళేశా!

వ. అనిన నానృపోత్తముండు ఋచీకునకుం జిత్తం
బు దనియ విత్తం బొసంగి తత్తనూజుం దోడ్కొని యుత్తమోత్తమంబు లగుపుష్కరం
బుల నధ్వరం బొనర్తు నని సత్వరంబుగ నచ్చ
టికి వచ్చిన.

క. ఆపుష్కరముల నచలుం
డై పరమతపంబుఁ జేయునలకౌశికు ని
ష్పాపు శునశ్శేపుఁడు గని
యాపన్నత దోఁప వినతుఁడై యిట్లనియెన్.

క. జననీజనకుల నమ్మితి
ననఘా! వారలును నన్ను నమ్మిరి జననా
థునిక్రతుపశువుగ నివ్వల
నిను నమ్మితి నీవె గతి మునిపతీ! సుకృతీ!

క. అన విని తనతనయులతో
విసుఁడీ మీలోన నొకఁడు వీనికిఁ బ్రతిగా
జనపతిమఖపశుతకుఁ జనుఁ
డనఁ బకపక వారు నవ్వి యాతనితోడన్.

తే. ప్రాప్తకాలుఁడై యొక్కనెపంబు వోడమి
పుడమిఁ జచ్చెడివానికై కొడుకుఁ జంపి
వాని బ్రదికింతు నని యెంచువాఁడుఁ గలఁడె
కర్మగతి యంతయలఁతియె కడకుఁ ద్రోవ.

క. విన ఁ బొసఁగనియీకార్యము
చనుఁ జన దని యెన్నికొనక జనకా! ఇటు లే
మని పలికితి వవివేకివె
తనతనయునిఁ దానె చంపుతండ్రియుఁ గలఁడే.

క. అనుటయు నాపం బొనరిం
పనిమీరలు శునకమాంసభక్షకు లై పోం
డని వారి శపించి తపో
ధనుఁడు శునశ్శేపుఁ జూచి తద్దయుదయతోన్.

సీ. అన్న! చింతింపకు నన్నుఁ గన్నపుడ యా
పన్నత యెన్న నెం దున్న దింక
నిందు వహించి ని న్నిందు వహించిన
వేల్పు మృత్యుభయంబు వీడుకొల్పు

గాధలు రెంటిని బోధించెదను నీకు
నివి నుప్రాణత్రాణనిపుణములుగ
విశసనవేళను గుశలత నల్లన
వానిం బఠింపుము దానికతన

తే. నింద్రుండు నుపేంద్రుండుం బ్రమోదసాంద్రు
లౌచు, నీకు దీర్ఘాయువు నొసంగి నృపతిక్రతువు
ఫలముం బూర్ణంబుగా నిత్తు రలఘుకరుణ
నంచు నవి యుపదేశించి పంచుటయును.

వ. అతండును ఖేదంబు దొఱంగి మోదంబున మనఃప్రసాదం బమర మేదినీపతిం జేరి నీకు నుభయలోకసుఖం బఖండితంబుగ మఖంబుఁ జేయు మని సుముఖుం డయి పలుకుటయు సంతోషంబున నంబరీషుం డశేషఋత్విక్పురోహితసహితుం డై వేగంబ యాగంబు సుప్రయోగంబుగాఁ జేయుచుం బశువు నాలంభింపఁ బూనుకాలంబున నాశునశ్శేపుఁడు మేధానిధి యగుట నసాధారణగాధాద్వయంబు రహస్యంబుగాఁ జదివిన నింద్రోపేంద్రులు దానం బ్రసన్ను లయి తమరూపుఁ జూపి శునశ్శేఫునకు దీర్ఘాయు వొసంగి యంబరీషునకుం

బరితోషం బొదవం బరిపూర్ణక్రతుఫలం బొ
సంగి నిజావాసంబునకుం జని రంబరీషుం డ
యోధ్యానగరంబున కరిగె శునశ్శేపుం డిట్లు
స్వమాతుల విశ్వామిత్రయమిత్రాణప్రాణుం
డగుచుం దపోధురీణుం డయి యుండె గాధే
యుండునుం బుష్కరంబుల దుష్కరం బగుత
పంబు సలుపుచుండ సహస్రవర్షంబులు నిండినం
జతుర్ముఖుండు ప్రత్యక్షుం బయి నీతపంబునకు
మెచ్చితి ఋషిముఖ్యత్వం బిచ్చితి నింతటం
దపంబుఁ జాలింపు మని చనుటయు దాని కొ
డంబడక యత్యుగ్రనియమంబున మఱియును
ఘోరతపంబు సేయుచుండ.

క. తత్తపముమహోత్తరత దు
రుత్తరతాపంబుఁ గూర్ప నుత్తలమునకుఁ
జిత్తము దత్తము చేసి ని
జోత్తమపద మతఁడు గోరునో యనుశంకన్.

చ. ఎద తుదలేనికంపము వ
హింప సహింపఁగరాని వేదనం
ద్రిదివసుఖంబు నెన్న కతి
దీనత నానతవక్త్రుఁడై సురల్

గదిసి తనుఁ భజింపఁగఁ ద
లంకఁ గలంక దొలంక నింక నె
య్యది వెర వేది కర్జ మెటు
లయ్యెడినో బ్రదు కంచు నెంచుచున్.

క. ఆలో నాలోచితత
త్త్వాలోచితకార్యుఁ డై మొగము దెలివొందన్
బాలోమీపతి మేనక
నాలోకించి యిటులనియె ననునయ మెనయన్.

సీ. కోమరారునీకాలిగోరుఁ బోలుటఁ గోరు
తార నీపాటి శృంగారవతియె
నీయూరుతీరునకే యేఁకరుచు నుండు
రంభ ని న్నెనయ సారంభ యగునె
నీచూపుఁగోపులనీటు పూనఁగ లేని
హరిణి నీకరణి విస్ఫురణఁ దగునె
నీలలాటశ్రీలఁ జాల లాఘవ మొందు
శశిరేఖ నీఘనశ్లాఘఁ గనునె

తే. యేల జేజేల వెలనవలాల వేల
వేలలీలాకలాలాపవే ఖతాంగి
బొంక నేవంక నకలంకభూషణంబు
మేనకా! దేవరమకు నీమేన కాదె.

క. నీసాటిబోటి గలదే
భాసురపంచాస్త్రశాస్త్రపరమార్థోప
న్యాసంబులు గద నీనవి
లాసంబులు రసికతిలకులకు లకుచకుచా!

మ. బలునిన్ ద్రుంచితి జంభునిన్ దునిమితిన్
బాకున్ విదారించితిన్
బొలియంజేసితి వృత్రునిన్ నముచియే
పున్ మాపితి న్నేఁ గుతూ
హలినై నాతి! మదీయసాతిశయబా
హాహేతి హాహేతివా
దులఁ జేయున్ బయివచ్చు జోదుల నజా
దుల్వేల్పు లగ్గింపఁగన్.

ఉ. ఏయెడఁ జింత వంత యొక
యింతయు స్వాంతముపొంత లేనిమా
కీయెడఁ గాంతరో! పొడమె
నెంతయుఁ జింతయు వంతయు న్నితాం
తాయతభంగి నేమి గత
మా వినుమా వినుమానికంపుజో
డై యిల గాధిసూనుఁడు త
పోధికతం దన వేఁడిఁ జూపెడున్.

క. పెకలదు నామేఘముచే
సకి! తావకచకచకోల్లసచ్చికురకదం
బకమేచకమేఘముచేఁ
బెకలుపు మేశత్తపంబు బీరం బారన్.

క. పవిహాతిపా ల్సేసితి నే
పవిహాతిగా గిరులపెక్క లక్కట యివ్వ డా
పవి పనికిరాదు సిరూ
పవిహ్వృతియూయుచలు గెలువఁబవిహా నువిదా!

క. ససమాధికుఁ డై యున్నతఁ
డసమాధికుఁ డయ్యె మాకు నతనివలనిసా
ధ్వస మాధిఁ బెనిచె నే నో
ధ్వసమాధిం దేవ్ప నీవ వలఁతివి పొలఁతీ!

క. సొలపుంజూపుంగోవుల
నలకుట రట మయ్యె నీకు నంతక్కూఖు లా
బలుతపసులె తమతలఁపుల
నిలుకడఁ జెడి కుంద రదననిర్జితకుందా!

శా. నీ నెమ్మో నమమించు మించ ఘన మై
నీకొప్పు నీ కొప్పుఁగా
నీ నృత్తానుగమర్దళధ్వనిసము
న్మేషంబు పెన్గర్జగా

నీ నీకే యనుకూలవాయువుగ ను
    న్నీలభ్రమసారసం
ధానంబుం బ్రకటించి కౌశికతపో
    దావాగ్ని నీ వార్పవే.

శా. కందర్పాధికదర్పమగ్నులయి వే
    డ్కన్నీదునీవీపదం
బంద స్సైనులు మ్రొక్క నొదలలయం
    దందంద నీ వీపదం
బెందుం బొందుగ మోపు దాటనె కదా
    యీయందె నీయందె శ్రీ
యందెం జందనగంధి! సంధిలిన యీ
    యోధి న్నిరోధింపవే.

ఉ. నీటున మీటుఁ జూపుచును
    నీజిగిచూపులు మారుతూపు లై
నాటక నాటి కాయభవ
    నాటిక నాఁటిక నిర్వహింపఁగాఁ
గూటమి కీడ్చి మేటిముని
    కోటికి బోధమునూటి యంతయుః
వీటిఁ జనంగ నీవదన
    వీటిక యిత్తువుగా వధూటికా!

క. అని వేఁడు వేల్పుఱేఁడుని
మనమునఁ బాయనివిషాదమయతిమిరము మా
య నిజస్మితచంద్రిక గా
య నిశాత్యయనళినదళనయన యిట్లనియెన్.

ఉ. మానని యింతవంత తర
మా సురమాన్యపదంబుఁ గన్నమ
స్నిని కి దేల వట్టివగ
నీకృప చేవగ నేవగన్ జగ
న్మానిత! తత్తపోమహిమ
మానుప నాదువిలాస మోపు నీ
పూనిక మోపు నాపయిని
మోపువెతల్ విడు మోపురందరా!

చ. అగు నన మద్వచఃకచకు
చాధికచారుతచేత నేతఱిన్
నగమదభేదనా! చిమమ
నా శుకనారదపర్వతప్రభా
వగరిమ నిట్టియే నమట
వర్తిల నెట్టి మునీంద్రుఁ డైన గ
ట్టిగ మదిఁ బట్టి యుండఁ గలఁ
డే నను నేఁ బొగడంగఁ బాడియే.

క. ఎక్కడిశ్రుతి యెక్కడిస్మృతి
యెక్కడిజప మేటి నేమ మెక్కడిధ్యానం
బెక్కడిజ్ఞానము చక్కని
చొక్కచకోరాక్షి యెదుట నుదుటైయున్నన్.

గీ. నాసముల్లాసమున నహాయాసముగి నె
యుత్తమోత్తమశమదమాయత్తచిత్త
వృత్తపోషకతత్తపోవిపులవహ్ని
మంటఁ గలపెద వల పెద నంటఁజేసి.

గీ. వానితప మెంత వాఁ డెంత వానిమాన
మేదఁజేయక మాన నీపాద మాన
మోద మానఁగ మాని యీాఖేద మాన
నీమమానసరీతికి నీతి యగునె.

క. అని యువతి దివిషదధిపతి
యనుమతిఁ గొని తనవయస్యలగు కమలాస్యల్
ఘనగానసుగమలాస్యల్
దనుఁ గొల్వ విలాసనరణి ధరణికి వచ్చెన్.

మ. వసుధం దోఁచె వసంత మంత సుమనో
వర్షాసక్తనిర్గళ
ద్రససంపూర్ణనిజాలవాలవిటపి
వ్రాతాభ్యుదితాతిహ్రా

ద్యసమాస్వాద్యతమద్యదగ్రఫలస
ద్యస్తృప్తమాద్యచ్ఛుకో
ల్లసదాలాపసుధాకలాపబహుళీ
లాపూరితాశాంత మై.

గీ. సకలతరుసాతిశయకీర్తి సంఘటింపఁ
బాలువడియును శుకపికప్రకరయుక్తిఁ
బక్షపాతానుసక్తిఁ దాఁ బ్రబలె ననఁగ
నలరిచె వసంతుఁ డలమన్మథాతిశయము.

సీ. తుమ్మెదలకు నోగిరమ్ము లౌనలరుల
కిమ్ముఁ దేనియ లెల్లఁ గ్రుమ్మరించెఁ
గీరవారమ్ముల కారివేరమ్ము గా
ఫలజాలముల నేలపాలు సేసె
దారలుసంటునఁ జూతతరుల నంటఁ బెనంగు
సలలతకూనలఁ దొలఁగఁద్రోచె
వని నిచ్చఁ దమయిచ్చ వర్తిల్లుఖగముల
గములకన్నులఁ బరాగములు చల్లె

తే. విరహిజనమానసము నేర్పువిధము నేర్చు
భావభవకేలి కొకకేళి యావహించె
గాలి యీవేళ దాక్షిణ్యశాలి యయ్యుఁ
జంచలాత్ముఁ డగ విశ్వసించఁ దగవె?

శా. సాలగ్రామమునందు మాధవుఁడు సా
 త్త్వోద్భావముం జూపఁ బై
పూలు న్గంధములుం హరించుచు మరు
 త్స్తోతంబు తచ్చాలనా
లోలం బై తనమందతం దెలుప నా
 లోఁ బొమ్మ పొ మ్మన్నయ
ట్లోలిం జిల్కలు పల్కసాగె హరిత
 త్స్తోమైకముం గాంచులన్.

సీ. పేరి హేమంతంబు పేరిదారిద్ర్యంబు
 జీర్ణచ్ఛదంబులఁ జిక్కనీమి
నివ్వాలికాల మిం కెటువలెఁ గడపుద
 మను వనములపేరిజనము లంత
మాధవానుగ్రహమహిమచే బహుకాంచ
 నాభివృద్ధులును నాగావళీవి
జృంభణంబులుఁ బ్రకాసిల్లెడుమావుల
 పెంపును మొదలుగా నింపు సొంపు

తే. నింపువివిభాగమశ్రీలు నెగడ రోద
సీచరాభీష్టఫలదానశీలతఁ గని
తగ నిబిడశస్తతద్యశస్తతు లనంగఁ
గొల్లలుగ నల్లెడల మల్లె లుల్లసిల్లె.

క. చిత్తజుఁ డత్తఱి విరహుల
కుత్తుకలం గోయ హత్తుక్రొన్నెత్తుటఁ ద
ళ్కొత్తెడువంకరసురియల
మొత్తము లన నవ పలాశముకుళము లమరెన్.

సీ. దళముల కెల్లఁ గర్త యయి పాంథవితాన
మర్దననిర్దయమన్మథునకుఁ
దగుసహాయతఁ బూని తానును గాంతార
హితవృత్తి నుండుటకతనఁ దనకె
సుమనఃప్రసన్నత యమరమి భావించి
మన్మథునకుఁ దేంట్లు మార్వె యగుటె
కాక తామె శిలీముఖము లౌటఁ గని తుద
మధుఘస్మరము లౌట మాననిపగ

తే. దనకు వానికిఁ గల్గుట దలఁచి మధువు
చింత లెదుగంగఁ బొదల వాంఛించి తనదు
పైకము వచింప వానిఁ జంపక యెచంపఁ
జంపకపరంపరల విజృంభింపఁజేసె.

సీ. అగముల ననలసంహతి మించె నతనుభా
స్వత్ప్రతాపోద్ధతివలనఁ బాంథ
పటలికి క్షమయందుఁ బద మూఁదరాదయ్యె
నలులు పాటలవాసనల మునింగెఁ

జెలరేఁగుబహుముకీచికల నాశలు నించె
మృగపాళి యలవడి మెఱయసాగె
నలసత్వము వహించి యవనీప రాగము
ల్నలుగడం బవనసంతతులు చల్లె

తే. నదులు తామరసస్ఫూర్తిఁ గుదురుకొనియె
ఘర్మఘర్మంబులు వసంతకాలముననె
కడలుకొనె జోకఁ దడలేక శాకయున్నఁ
దపముపరిపాక మిది యండ్రె ధరణిజనులు.

సీ. అత్తఱిఁ దెఱగంటిబిత్తరి తనచెలి
కత్తియ లిరుగడ హత్తి నడువ
నల కౌశికతపోవనాంతరమ్మునఁ జిత్ర
తరము నా మూర్తమై తనరుకాయ
భవుమాయచందాన భువనైకమోహనో
త్సాహనవ్యాసక్తిసహిత యగుచు
నందియ ల్మ్రోయంగ నందంపుమందంపు
నడ లంచలకు సిగ్గు గడలుకొలుపఁ

తే. బొలుపగు మిటారిచూపులపొలప మబ్జ
దళపరంపరసంపదం దలఁపఁజేయఁ
గలికిపలుకులు చిలుకలకలకలముల
చెలువు నగఁ దగ సొగసుగ మెలఁగఁ దొడఁగె.

క. ఆవనిత చెలులతోఁ బె
ల్లావనిఁ బ్రచ్ఛాయమంజులావని సుమనో
లావనిరూఢికిఁ గుతుకపు
లా వనిరుద్ధంబుగాఁ జెలంగినమదితోన్.

క. ఏమనికిత మార్పని దిది
యామనికిం గామునికి మహాకమనీయం
బౌమనికిఁ గూర్పు నివ్వని
నే మని కీర్తింపఁగలఁ డహీశ్వరుఁ డైనన్.

క. భోగులకును యోగులకును
బాగుగ ననమాంబకై కభజనాకలనో
ద్యోగిత రక్తివిరక్తి
శ్రీగరిమ ఘఁ జెంద నిదియె సేవ్యము సుండీ

ఉ. ఈమహనీయ మైన వని
యీయవనిన్ సుమనోరసజ్ఞతం
బామరకోటి కైన నెఱ
వంగల దంచు సదా నుతింప రా
దా మదిరాక్షులార! పర
మాద్భుత మారఁగ నిచ్చు నిచ్చటన్
భూమిరుహంబులున్ మిగులఁ
బూనెడుఁ బండి తతాభిరమ్యమున్.

సీ. ఇంద్రద్రు లివ్వని నెన్నియో యెన్ని యో
పుసె శేషుఁ డివి యున్ని యని వచింప
సంభావనోచితరంభాపరంపరా
జృంభణం బెంత వర్ణించితీరు
రాణించునట్టియింద్రాణీసహస్రముల్
గనుఁగొనఁ జాలునే కన్నుదోయి
యపరిమితాభ్యంచితైరావతస్ఫూర్తి
యెం దైన వింటిమే యిటకుమున్న

తే. స్వర్గవని సాటి గాదె కాస్వర్గ మయిన
దీనితో మానితోపమం బౌనె యదియుఁ
బోడ వగుట దీని దాని నంభోజభవుఁడు
తుల నునిచి చూడ లఘుతఁ జెందుటనకాదె.

క. అని వనిఁ బొగడుచు ననిమిష
వనితాజనతామతల్లి వల్లీతరుకుం
జనికాయముల వయస్యా
జనములతో విరులు గోయసాగెఁ వేడ్కన్.

సీ. చెలి! రాకు లేమావితలిరాకుఁ జేకొనఁ
గొవకంట మున్న కఁ గొంటి నేను
పొందువారము గదే సిందువారమువిరుల్
వంచి యిచ్చెద నీకుఁ జంచలాక్షి!

క్రన్నన నల్గడఁ బొన్ననల్ రాలె
నిందుఁ జూతము రావె యిందువదన!
జగడమా నాతి! యీపొగడమానాతీత
కుసుమము ల్నివుము గోయు మిచటఁ

తే. జేతి కందదు నమ్మితిం జెల్లఁ గూర్మి
కొమ్మ వంచును సంపఁగికొమ్మ వంచు
నిరతి నిటు మొల్ల లేఁ గోయ నీకు వేత
యక్కఱా వేగ యిచటి కోయక్క రావె.

రగడ. తోడు రా రని యేఁరి దూఱెదు
దూఱె దేటికి మాటి కీరము
నాడఁ బట్టిన నొక్కనలె నీ
యధరబింబము మేటికీరము
పూవుఁబోదలకు నీవు మున్నుగఁ
బోకు మే నిదె చాలఁ దుమ్మెద
వావిరిఁ నినుఁ జుట్టుకొని ముఖ
వనజవాసనఁ గ్రోలుఁ దుమ్మెద
కమ్మఁదావులఁ జిందు నెందును
గలదె సరి యీపూవు రెమ్మకు
ముమ్మరవుఁదమి దీనిఁ బూనితి
మొక్కలమ్మున నీవు రెమ్మకు

మేను గ్రోలిన నుమ్మలించెద
రింద ఱిం దరుదా మరందము
వేనవేలవిధంబులం గడు
వెలఁదిఁ బిలిచితి నేమరం దము

నెంత వేఁడిన దాని కుచితమె
యేను వచ్చినత్రోవ రా ననఁ
గాంతతరములు కొండగోఁగులు
గల్గెఁ గద మన కోవరానన!

మొల్లపొట్లము లీవు ముట్టకు
ముదిత! యివి యామచ్చికంటివి
చెల్లఁబో యీవగలు దలఁపకు
చెలులమది నిఁకు నిచ్చ కంటివి

ఫలభరము విలసిల్ల నల్లదె
పరఁగుచున్నది ప్రమద! మారెడు
బలిత మై తగుదీనిఁ జూడఁగ
భావమునఁ గడు ప్రమద మారెడుఁ

గాంత! కన్నులకఱవు దీఱఁగఁ
గంటి నిచ్చట నీయనంటిని
వింత యిది చూపుటకె యే నిను
వేఁతెడకుఁ బోనీయ నంటిని

మంచినిగ్గుల దెసల నించుచు
మగువ! యున్నది మంకెన న్నన
త్రుంచివైవకు మనిన వదరఁగఁ
దొడఁగెఁ గద యిది మంకె న న్నన

నీమమల్లెలు దాఁచె నెఱుఁగదె
నీమదిం గర మున్నముచ్చట
యీమ పలుమఱు దాని వేడకు
మీయ నేర్చునె మున్న ముచ్చట

యలరుఁదేనియ వంక పొంకం
బగుట నతిమురిఁ గాన కున్నది
వెలఁది! యిది యెడ తెగక నెగడఁగ
వేఱె వల దిక్కానకున్నది

కలికి! యాటల కేను జల్లినఁ
గంటఁ బడియెనొకో పరాగము
కలయ మొగమున నదియ కతముగఁ
గదియవలయునె కోపరాగము

విరులు గోయఁగఁ బొత్తు గూడియు
విసివితివి నీ కేది నిలుకడ
తరుణి! ఇప్పటివిరులు వంచెదఁ
దత్తరపుటుక్కేది నిలు కడ

నేను నిలిచితి నళులకును నస
మీక యాకలిగొట్టుదండన
హీనవార్తల నన్నుఁ గదిమెద
రేటికే యాగొట్టుదండన.

క. అని పలుపలుకులు పలుకుచుఁ
దనచెలులును దాను గాధితనయుసమీపం
బునఁ గుసుమాపచయంబునఁ
దనిసి యతనిఁ జేరి చేరి తద్దయు వేడ్కన్.

చ. పులక లెసంగ నంగములు
పొంగ నభంగురవిస్మయంబు శో
భిలఁ దమి మీఱ సన్నిధిని
బెన్నిధిఁ గాంచినపేదవోలెఁ గ
న్నులకఱ వెల్లఁ దీఱఁగఁ గ
నుంగొని యెంగనకాంగి యంగభూ
నల నలకూబరేందు హరి
నందనసన్నిభు గాధినందనున్.

వ. కనుంగొని తనమనంబున.

సీ. చాలఁ జక్కనివాఁడు జనతానుతాజాను
లంబిదోర్యుగయుగళంబువాఁడు
కడు లేఁగవునువాఁడు కర్ణాంతవిశ్రాంత
కమలాతికాంతనేత్రములవాఁడు

నగునెమ్మొగమువాఁడు నవహాటకకవాట
జయబద్ధదీక్షవక్షంబువాఁడు
నిగ్గుచెక్కులవాఁడు నిస్తంద్రతరచంద్ర
శకలహాటకలలాటికలవాఁడు

తే. ఠీవి గలవాఁడు గంధఫలీవిలాస
వాసనాసావిభాస క్తివాఁడు తపసి
ఱేఁడు నాకన్నుఁగవ కబ్బినాఁడు నాకు
నాఁడుఁబుట్టువు సాఫల్య మందె నేఁడు.

మ. అని చిత్తం బిగురొత్త న త్తపసిచె
ల్వాత్తన్వి వర్ణించి గా
ఢనిరూఢోగ్రతపోతిపోషణపటి
ష్ఠస్వాంతునిఁ గాధినం
దనునిం బేర్కొని యోమునీ! దివిజకాం
తం మేనకం వచ్చితిం
నినుఁ గొల్వం దప మింతట న్నిలిపి న
న్వీక్షించి రక్షింపవే.

క. అని నృత్తగీతవాద్య
ధ్వని ఘుమ్మన రక్తి గులుకఁ దానుచెలులుం
మొనయించినఁ జెవి కించిన
విని యంచితతద్రసైకవివశాత్మకుఁ డై.

ఉ. అంతరదృష్టి యంత వెలి
    కగ్గము చేసి యతండు గాంచె న
త్కాంతఁ గఠోరవృత్తకుచఁ
    గంజముఖిన్ గరిగామినిన్ గన
త్కాంతితటిల్లతన్ గలమ
    గర్భసహోదరజంఘికాద్వయిన్
గంతువధూపమన్ గలువ
    కంటిఁ గళానిధిఁ గంబుకంధరన్.
క. అపుడు చపలాక్షి తపసికి
నుపమాతీతభయభక్తియుక్తి న్నతి చే
సి పటూక్తుల సన్నుతి చే
సి పరేంగితవేది యైనచిత్తముకల్మిన్.
వ. అతని కి ట్లనియె.
క. యోగము చాలింపుము మతి
భోగముఁ గీలింపు మింపు పుట్టించెద నా
నాగతులన్ యువతిమనో
రాగాధేయా రమింప రా గాధేయా!
క. ప్రాపె దవీయముఁ జేసెదు
కా పెద వీక్షింపు మేల కఠినత్వంబున్
జూపెద వీవగ వీణ్కాని
నీపెదవిని గెంపుపెంపు నెఱపెద నింకన్.

మ. ఇటు రారా పటురారటత్పరభృత
మ్మిప్పాటఁ బాటక్ శ్రవః
పుటభూయఃపుటపాకము న్నెఱపుటం
బుట్టించె దట్టంపుటా
రట మె ట్లూరట మారదోరటదను
ప్రస్ఫారటంకార మ
క్కట నే నొక్కట నెట్టు
కా రూపరాకాశశీ!

క. అని తేనె లూరఁ బలుకుచు
మనసిజసామ్రాజ్యలక్ష్మిమహిమ నెఱపుతోఁ
దనకట్టెదుటను వినతా
నన యై యున్న చెలిచెల్వునకు విస్మితుఁ డై.

క. వినమో కనమో జనమో
హనాంగు లగునంగనల ననంగుని చెలిరం
గొనరం గనుంగొనం గను
గొన నీయంగన యనంగకుతుకద యయ్యెన్.

సీ. దీనితిన్నని మేనిమానితద్యుతిఁ గన్న
వందనం బొనరించుఁ గుందనంబు
దీనిక్రొందళ్కుఁ జెక్కిళ్లకు సరిగావు నిద్దా
నీరసం బరి నీలసారసంబు గంధాలయం

దీనిలేనగునీటుతేటమోము దలంచి
ప్రేమరసం బూనుఁ దామరసము
దీనిమోహనకళశ్రీ నున్నతెఱచెల్వ
వారకములు గోరుఁ గోరకములు

తే. దీనిమెఱుఁగారునూఁగారుతీరు మిగుల
సాదరంబునఁ బొగడుఁ గాకోదరంబు
పూనెఁ ద్రిభువనకమనైకమానదమన
మీలతాంగ్యాకృతిఁ జెలంగ నేలతాంగి.

గీ. ఔర దళితలలితహరినీలములచొప్ప
దప్ప కొప్పు దీనిగొప్పకొప్పు
వేయు నేల యలరువిలుతుతూపులకుఁ గ్రొం
దళుకుఁ జూపు దీనితళుకుఁజూపు.

ఉ. నెక్కొని చంద్రసూర్యులకు
నిండుప్రకాశ మొసంగఁ జాలి తా
నెక్కువ నొక్కచందమున
నే మన నేర్చి చిరప్రభాళికే
యిక్కయి చొక్క మాచు నుతి
కెక్కెడునిక్కలకంఠకంఠికొ
ప్పెక్కడ నీలమేఘ మది
యెక్కడ నిక్కముగాఁ దలంచినన్.

క. ఈలలనఫాలమున కెన
గాలేక శశాంకులేక కడుఁ గృశ మగుచున్
దూలి గిరీశుశిరంబున
వ్రాలి తపము సేయుచున్నవగ గన నయ్యెన్.

ఉ. కొమ్మవెడందకన్నుఁగవఁ
గూర్చినపూర్ణసువర్ణలక్ష్మిఁ బ
ద్మమ్ములు గోరి పంచికొని
తమ్ములు గాన విభాగపత్రముల్
సమ్మతిఁ గాంచి యిం డ్లగుచు
లచ్చికి స్వర్ణములం గొఱంత లే
శమ్ము నెఱుంగ కున్నయవి
సల్పుచు శ్రీహరిపాదసేవలన్.

మ. నవతం జెందక శ్రీలకుం బరమజ
న్మస్థాన మై చాల మా
ర్దవ మొప్పన్ యువకోటులన్ వలలఁ జే
ర్చన్ నేర్చి రాజిల్లుఁగా
నవసంఖ్యన్ మరి శ్రీలఁ జక్కలముల
న్నాలంబులం బోల్ప ధ
ర్మవె యీపంకజపత్రనేత్రరుచిర
శ్రోత్రద్వయీలక్ష్మితోన్.

గీ. ఈసరోజాక్షియందంపునాస గెలుచు
నాస మొనఁ జూపి వెట్టవ ల్పనెమతనదు
వెలితిచే గంధఫలి దళమ్ములు ముడుంగ
నళికి డాయంగ రానిదై యడవిఁ బడియె.

సీ. ఎంతయుం దాళి పొం దెనయంగఁ దనలోహి
తత్వంబుఁ బెంపు నిద్దంపుఁగెంపు
దండఁ బాయక యుండి తనయనురాగంబు
విదితంబు గావించు విద్రుమంబు
చన వల్లికొన నంటు గని తనయతిలోహి
తం బాటఁ బ్రకటించు బింబఫలము
తతసౌమనస్యమై తినయరుణోదయా
శ్రితతఁ జూపును బంధుజీవకంబు

తే. గా వివి సమంబు లేక మరి యేవి సాటి
నా వినుతిఁ గాంచి నవసుధాస్రావియగుచు
నీవిధంబున నొప్పునే యింతకీవి
నీవిలాసిని చెంగావితావిమోవి.

గీ. మూలజాలలీల బాలపల్వారుస ప
ల్వారుసలను బ్రతిష్ఠఁ బొలసి మెఱయ
గాలి సోఁకఁ గదలుఁగా తత్సమత కెట్టు
లొగ్గఁ జాలు మొల్లమొగ్గచాలు.

మ. వనితారత్నముమోముతో సమతకున్
వచ్చు న్గదా వాది యై
కనదే తాంతత విభ్రమద్భ్రమరకాం
కంబో నిరస్తేందువో
తన కందం బమితంబొ లేఁల వనజా
తం బాత్మఁ బాటించుఁ గ్ర
న్నన ని శ్లిన్న విభిన్న మయ్యె నవిభి
న్నత్వాభిమానోన్నతుల్.

చ. చిలుకలకున్ వచోగురుతఁ
జెందుచు సప్తవిధస్వరంబులన్
బలుమఱుఁ దేనియ ల్గులుకఁ
బాడెడునీలలితాంగిఁ జూచి లో
కులు మరి కీరవాణి యనఁ
గోకిలవాణి యనంగఁ దోన చి
ల్కలు విని రామ రామ యనుఁ
గన్నులఁ గెంపు వహించుఁ గోయిలల్.

ఉ. మౌక్తికమాలికావృతము
మంజులకోకిలనాదమాధురీ
యుక్తము తప్తకాంచనస
ముజ్జ్వలకాంతిమ్మృదుత్వనిత్యసం

సక్తము నైనచానమెడ
చందము చిందము చెంద నెందులన్
శక్తము గాక వార్ధిఁ బడి
సంతతము న్గను భంగసంగతిన్.

గీ. అంటినను గందు టల లతలందు లేదు
హైమకాంతి మృణాళంబులందు లేదు
మ్లాని యెఱుఁగమి కుసుమదామముల లేదు
తగునెయివియీామగువబాహుయుగముఁబోల.

సీ. నవనవఘనసమున్నతిఁ గన్నవీనికిఁ
దమ్మిమొగ్గల కెగ్గుఁ దలఁచు టెంత
హారవిస్ఫూర్తిఁ జెన్నారెడువీనికిఁ
గుంభికుంభజయోపలంభ మెంత
స్వరుచిరదీప్తిబంధురము లౌవీనికి
బిట్టు మిట్టల మట్టుపెట్టు టెంత
చెలువంపునెలపెంపు వెలయింపువీనికి
జక్కవకవయుక్కుఁ జెక్కు టెంత

తే. యిటులు నుతిపటలంబు డాల్చుటకుఁ దామె
పటువు లై చాల బటువు లై పద్మనాళ
తంతువున కంతరం బీక యింతవింత
సంతరించు నె యీాకాంతచన్ను లవుర!

తే. కావు బిసములు సుమదామకములు గావు
కాంతభుజములు లతలట్లు గామిఁ దల్త్ప
భావమున నిట్లు శుభకరపల్లవములు
నఖరకోరకములును గానంగఁబడునె.

గీ. వనితతను వనునవని లావణ్యరసము
ముంచఁ దదుదరవటపత్రము శయించు
శ్రీరమణుతీరునను గరభోగముక్తు
గారుమెఱుఁగారునూఁగారు గాననయ్యె.

క. గాంభీర్య మమరఁ గూపము
సౌభాగ్యముఁ జెంది సుడికి సమ మై బళిరా
యీభీరువునాభి గదుర్
శోభిలెఁ బొన్నవిరిమాడ్కిఁ జూడ్కికి ఫలమై.

క. కొందఱు సాకారం బనఁ
గొంద ఱసాకార మనఁగఁ గొందఱు నిర్ణీ
తిం దగ సందియ మందఁగ
నిందువదనమధ్య మాత్మ కెన యనఁ దనరెన్.

మ. వరరత్నాకర మేఖలాకలన నీ
వామాక్షియత్యంతవి
స్ఫారణాలంబనితంబబింబమునకున్
భూచక్రముఁ సాటిగాఁ

బరికీర్తింపుచు ధర్మమా పులినముం
బాటింపఁ బో నేకతం
బారఁగం గాంచియు సైకతాఖ్య యది చెం
దు స్నేతిబీరంబలెన్.

చ. అశివశుభోరులక్ష్మి నిజ
హస్తగతంబుగ నమ్మి హస్తియు
స్నతిఁ గనుపట్టఁ బట్టభర
ణంబు నిజం బని తా ననంటి యా
తతదళమై తదుద్ధతికిఁ
దాళక రూపక మవ్యె భంగసం
యుత మయి దాన వాలి బల
మున్నెడఁగాక జయంబు గల్గునే.

సీ. కాహాళంబులు పోలఁ గదిసి చేపట్టఁగాఁ
దవిలి కూయుట యథార్థంబు గాదె
మకరముల్ సమతకు మలసి వనంబుపా
లై డాఁగి యునికి సత్యంబు గాదె
దొన లెన గాఁ జొచ్చి వెనుక మిక్కిలి గట్టి
గాఁ గట్టువడుట నిక్కంబు గాదె
కలమగర్భము లీడు గాఁ బూని కడపటఁ
దలకోఁతఁ బడుట తథ్యంబ కాదె

తే. యిది యసాధారణం బౌట కింకఁ జాట
వలయునే వేఱె యని తేట తెలివి గాఁగ
నఖిలజనులు నుతింపఁ బెం పందె నౌర!
యీయణూపమమధ్యజంఘాయుగంబు.

చ. కరిపతిపాటిమేటినడ
కల్గనవో నఖరాంశులక్ష్మిచేఁ
బరఁగవొ చెల్వొనర్ఛ ఘనతఁ
బాయక యుండవో యిట్టిదైన యీ
తరుణిమనోజ్ఞపాదములు
తామరసంబుల గెల్చు టేమియ
బ్బుర మని చాటు నందియలు
భూరిఝుళంఝుళనాదవైఖరిన్.

చ. అని మది మెచ్చి మెచ్చి హృద
యస్థితకౌతుకపూర మంతయుఁ
బెనఁగొను చూపులన్ దివిజ
భీరువు నారయ నావధూటి యా
మునిహృదయం బెఱింగి కడు
ముద్దులు గుల్కెడు కమ్మఁబల్కులన్
మునిమణితోడ నిట్టు లను
మోదమహోదధి నోలలాడుచున్.

ఉ. ఓమునిసార్వభౌమ! యొడ
లోమక నీమకరాంకరూపరే
ఖామహనీయభావ మిటు
కాననచంద్రికఁ జేసి గాసితో
నే మని యీతపోనియమ
మీవనమధ్యనివాస మీసము
ద్దామవిరక్తియుం బడసి
తారెదు నామది కందెడుంగదే.

క. బంగారువంటియంగము
సింగార మడంగ దుఃఖసేవ్యతపోవ్యా
సంగమున నలంగెద వికఁ
నంగజసుఖమునఁ జెలంగు టది యెన్నఁటికో.

సీ. బంధత్రయం బెందుఁ బాటిపో దెనుబది
నాల్గుబంధములఁ బెనంగవయ్యా
తలఁగఁగ నెలయమృతం బున్నయది నాయ
ధరబింబసుధఁ గ్రోలి తనియవయ్యా
యెపుడును వినునాద మేవింత నీ వింత
యెనసి నామణితంబు వినఁగదయ్యా
లోవెల్గు చొక్కంబుగా వేడ్క నాచూడ్కి
చొక్కంపుజిగిఁ జిక్కి చొక్కవయ్యా

తే. ప్రకృతి నీలో నడంచునభ్యాసివె కద
నీకవుంగిట న న్నెడ లేక తనువు
లేకముగఁ జేర్చి యద్వైతపాకలక్ష్మి
మెండుగ నఖండసుఖలబ్ధి నుండవయ్య.

క. ఈకడ నాకడ ననరా
కేకడ నాకసముఁ బోలె నేకం బై యే
శోకము రానీక పరం
బై కనుఁగొనన్నైన తత్త్వ మది నీవ కదా.

క. విను మాత్మవేది కెటు లు
న్నను లె స్సేక్రియలు చేసినను బాసిన నూ
ల్కొన దెక్కువ తక్కువయును
మనము చిదానందరసనిమగ్నం బగుటన్.

క. ననుఁ గలసి మలసి విలసిలు
మనయము నే నతిపవిత్ర నయ్యెద నీచే
నినుము పరుసంపుసోఁకునఁ
గనకం బగువిధము మీఱ గాధికుమారా!

తే. అని బహుశ్రుత యైనయావనజగంధి
నిజమవశికంజరంజననియతిఁ బలుకు
యోగభోగానుకూలవచోగరిమకు
మెచ్చి యమ్మౌని యి ట్లను మెలఁతతోడ.

క. నా కోకకోరిక కల దది
చేకూరుటకొఱకుఁ గఱకుశీలంబున ని
ష్ఠైకాగ్రసమగ్రమతిం
గైకొంటిఁ దపంబు మచ్చెకంటీ యిచటన్.

ఉ. పంకజగంధి! యే నిటు ల
పారతపోరసపారవశ్య మే
యంకిలి లేక యుండ హృద
యంబునఁ బూనఁగ నింతలోన మీ
నాంకునిశక్తి శంకరుమ
హత్త్వము రెండును నేకమూర్తితం
బింకము పూనినట్లు గని
పించితి చెల్వముఁ దెల్వియుం దగన్.

ఉ. ఏ నిను నింకఁ బాయఁగల
నే కలనేనియు నీయొయారముల్
నీనడ నీతనుద్యుతియు
నీకచబంధము నీకుచద్వయీ
మానితలక్ష్మి నీజఘన
మండలి కన్నులపండు వయ్యె నీ
మానస మిచ్చి నచ్చి నెఱ
మచ్చిక ముచ్చట దీర్చు మిచ్చటన్.

చ. చెలి యిటు లాడున త్తపసి
చిత్తము నమ్మక శోధనార్థమై
కెలఁకులఁ జిల్కపల్కులు స
ఖీవచనంబులు చేసి యే మిదే
పిలిచితి రంచు లేచి తరు
బృందముమాటున కేఁగ నంతలోఁ
జెలి! యెటు వోయితే యనుచుఁ
జిత్తజవేదన నాతఁ డిట్లనున్.

ఉ. సొక్కితిఁ గన్నులార నినుఁ
జూచియుఁ జూడకమున్న సొక్కియున్
జొక్కపుసీకటాక్షసుధ
సోఁకున గ్రక్కునఁ దేటితిన్ సనున్
మక్కువ పెక్కువం దనుపు
మానక మేనక! సూనకార్ముకుం
డొక్కట దిక్కటాహదళ
నోగ్రధనుర్ధ్వని వెంట నంటెడున్.

ఉ. గేదఁగిచిక్కటారిఁ గొని
కీరమయూరసమీరణాదులన్
గా దని తుంటవింటిదొర
కంటున గెంటఁగ వెంట నంటి రాఁ

గా దయ మాలి చూచెదవు
గా యవుఁ గా దన కింక నామనో
వేదన లింక నేలుకొన
వే విన వే ఘన వేణి కామణీ!

తే. పలుక వే వేడ్క నమృతంబు గులుక నలుక
పూన కే మీన కేతనాస్త్రానలార్చి
యార్చి దయఁ గూర్చి కౌఁగింటఁ జేర్చి పేర్చి
తెలుప! వెఱవకు మని భీతి దీర్పఁగద వె.

మ. అలు కేలా విలు కేలఁ బూని మరుఁ డే
యఁ దాళఁగాఁ జాల ని
న్నెలపె న్వెన్నెలకాఁక మీఱె మితి యెం
తే నమ్మితిఁ నిన్ను నీ
కలఁపఁ బాడియె నన్ను నన్నుదలమి
న్నా! కూరిమిఁ నామనం
బలరింపందగదే దయోదయము నా
యం దుంచి యేలంగదే.

క. మారానల మార సుధా
ధారాధార మగుపల్కు దయసేయఁగదే
యోరమణీ! హీరమణీ
భారమణీయ మగుదంతపఙ్క్తి వెలుంగన్.

ఉ. హా నను నీవు నీయధర
మానఁగనీవు మరుండు తాల్మి కెం
తేనియు నెన్నఁ డేలు టిఁక
నెన్నఁడు గాచెదొ కావ కేఁచెనో
మానసవృత్తిఁ దెల్పు మిఁక
మాటికి మాటికి మాటమాటకున్
దేనియ లొల్కఁ బల్కు వెలఁ
దీ! యెటు రా వెలదీవయింటికిన్.

క. మే లెఱుఁగమి మేలె బళీ!
యా లే యీావమాన ముచిత మానా బాలా!
యేలా లీలాలోలా
వేలాలోకములు వెల్లివిరియింపవయో!

క. నాళీకశరుఁడు సుమనో
నాళీకము లేయఁ దాళ నవచంద్రకళా
ఫాలా బాలా! యీాలా
గేలా చాల నలయింప నిఁక నేలఁగదే.

క. చెలువముగని! నీచెలు వగు
చెలువము గని యలరునవుడచిత్తముఁ డలరున్
జిలుకలు బలుపగ నలఁపఁగఁ
దళుఁకెద నాకొదవ నా కొదవఁజేయకువే.

ఉ. చూపుల కింపుగాఁ గళల
సొంపులు నింపుభవన్ముఖేందునిం
జూపవె మందహాసమిష
సుందరచంద్రిక నేఁడు నాపయిఁ
బైపయిఁ బర్వ గర్వమున
మాటికిమాటికిఁ గ్రమ్మి తమ్మిపూఁ
దూపులు నించునించువిలు
తుఁ గెలుతుఁ వగ మాని మానినీ!

ఉ. ఏటిపరాకు నఁ నొగుల
నీకు ప్రణామ మొనర్తు నీకు నీ
పాలలతేటలఁ నగవుఁ
బల్కులఁ గుల్కుల మాటిమాటికిఁ
మీటుఁగ నింపు నింపు కడి
మిం గడిమించి రమించు మించువి
ల్లూటున కల్కి నీమఱుఁగుఁ
జొచ్చితిఁ గల్కి నిజంబు వల్కితిన్.

సీ. పెదవి మోపినఁ దోన నొదవినపులకల
మొలకలు పొలు పగువలవుఁ దెలుపఁ
గ్రోలుచో నరమోడ్పు గొనుపెనుగనుఁగవ
మనమునఁ బెనఁగొనుననువుఁ బెనుప

మునిపంట నటచుఋ క్కున నొక్కఁ గరమున
మఱిమఱిఁ జఱచుట యొఱపు నెఱప
నామూలముగఁ గ్రోల నవశతఁ దనులత
రతిపతిమతి కతికుతుక మతుకఁ

తే. బంచదారను గడకుఁ బొ మ్మంచు మించు
మించుబొమ్మంచువాతెఱమంచిచవులఁ
దవులఁ దేలించి లాలించి తన్వి! తన్వి
నూలుకొనఁజేసి యెపుడు న న్నేలఁగలవొ.

చ. నిరతముఁ దా వసించుమది
నీకు నివాసముగా నొసంగుటన్
. మరునకు నాకు నీకతన
మానని వైరము పేరె వాఁడు నన్
విరులలకోరుఁలం గెరలి
వెంపఱలాడక యేఁల వోవు నీ
కరుణయ వజ్రపంజరము
గాఁదగు నిత్తఱిఁ గావు బిత్తరీ!

శా. ఆకర్ణింపు మొకింత వంతల మనం
బల్లాడ మల్లాడ మే
లా కాలాహివిషోన్నిమన్మలయశై
లాలోలబాలానిలున్

వీఁకఁ బోకఁగనీక జోక గదియఁ
వే రాక యీరాకఁ గ్రా
రాకారాంబుజవైరిబారి నిడి బా
లా! యేల నన్నేఁచెదే.

ఉ. నెమ్మదిఁ గూర్మి పేర్మి గతి
నీ వని నమ్మినవాఁడ నీకు మే
నమ్మినవాఁడ వాఁడిమరు
నంపఱఁ బెం పఱనీక నీకరా
గ్రమ్మునఁ జెక్కు నొక్కు మిటు
ర మ్మని కొ మ్మని ముద్దుగుమ్మ! నీ
కమ్మనిమోవితేనె యొసఁ
గంగదవే యెద వేఁడి దీఱఁగన్.

చ. నను ననురాగయోగము మ
నమ్మునఁ జేరఁగఁ జేరఁజీఱ వీ
పని యొనరింప కోరి యని
పంపవు చల్లనిచూడ్కిఁ జూడ వే
మనఁగల నే మనంగలనె
హా కరుణింపుము ప్రేమ నేలుకొ
మ్మనియెద బంటఁ గాని మరి
యన్యుఁడఁ గామిని హంసగామినీ!

శా. ఎంతే న న్నలయించి యింత యలయిం
తే ప్రోడ వింతే యయో
వింతే నీకును నాకుఁ గంతుఁ డలఁపన్
వేచింతలన్ వంతలన్
దాంతం బయ్యె నితాంతముం దనువు కాం
తా! రమ్ము మ త్కేళికా
కాంతారమ్మున కాదరమ్మున ననుం
గైకొమ్ము పూఁబాన్పునన్.

చ. కడుఁ గినియంగ నీకు మికెఁ
గంతు దయారసదూరు నాకుఁ దుం
దుడుకు గడించుఁ బెందుడుకు
తోడన నీకు ఘటించు దూఱు రా
వడిఁ బొదరిల్లు దూఱు జిగి
వా తెఱ గ్రోలఁగనీ సుధారసం
బెడ తెగ దూఱుఁ జేకొనఁగ
నీఁగదవే భవదూరుకాండమున్.

క. కాంతామణి! నీయధరము
చింతామణి యాననము శశి కచంబు ఘనం
బింతటివిను వేఁడియు నా
చింతిత మీలీల నేల చేకూర దయో!

సీ. మానినీ! కోపంబు మాని నీనవసుధా
మధురాధరం బిచ్చి మనుపరాదె
యంగనా!యలిగ్రమోఁత యంగనాహతి విజృం
భించ నించుక యాదరించరాదె
లలనా! మనంబు నల్లలనాడఁజేయునీ
మదనునాటోపంబు మాన్పరాదె
కామినీ! యన్యుండఁ గామి నీమన్మాత్ర
మొకపరి యెదలోన నుంచరాదె

తే. నారి! నారీతిఁ గనరాదె చేరి రామ
రామ నను పూను టకుఁగంగరాదె యతివ
యతివచోరూఢిఁ బిలిచి డాయంగరాదె
యిందురుచి యోర్వరాదె మదేభయాన!

చ. అని ముని పల్కుపల్కు లవు
డన్నియుఁ గన్నియ గూలకించి త
న్మనము నికామకామరస
మగ్నతఁ జెందుట నిశ్చయించి యొ
య్యనఁ బొడకట్టి మానితిల
కా! నలకాయజరూపధేయ' నీ
మనమున నింతకూరిమి య
మర్చితె నాదగుకోర్కి పండఁగన్.

వ. అని కమ్మఁదేనియలతో నైక్యంబు నెఱపువా
క్యంబులు వలుకుచుఁ ద్రైలోక్యమోహనా
ఖర్వగర్వనిర్వాహక గీర్వాణగాణిక్యమాణి
క్యంబు తను నెడఁబాయక యేయెడలం
గ్రీడింప బాస సేయించుకొను తెఱంగున నతని
కరంబులు తనశిరంబున నునిచికొనియుఁ, జేరల
కొలందు లివి యని కొలత దెలుపుపోలువున
నతని కరంబులఁ దన నయనంబుల నొత్తుకొని
యుసాత్త్వికస్వేకోదయపరీతు యొసంగుభంగిఁ
గపోలతలంబుల హత్తించియుం. దనహృదయం
బతనికిహస్తగతంబు గావించుకీవిని గుచం
బులం జేర్చికొనియు, నతనిమనంబు దక్కం
బెనంగె నది యాదిగాఁ బరమానందంబున.

సీ. నవనవాగతిగఁ బల్లవనవాగతిఁ గుంజ
భవనవాటులఁ గ్రీడఁ బ్రబలిప్రబలి
స్తోకతావిరహితానేకతాదృశ నదీ
సైకతాదులఁ గేళి జరపిజరపి
మందరాచలతులామందరాజతశైల
కందరాతతిఁ గూర్మిఁ బొందిపొంది
శీతలాలసలసద్వాతలాలితవన
ప్రాంతటావళి రతుల్ సలిపిసలిపి

తే. పొదలి పగ లిది రే యిది పూర్వసంధ్య
యిది యపరసంధ్యయిది యనియెఱుఁగఁదెలిపి
గానక యనూనకామసంధానకలనఁ
గనిరి మానక మేనకాగాధిసుతులు.

క. పదివర్షము లీవిధమున
మది హర్షము నిండ నుండి మఘవంతుం డీ
మదిరాక్షిఁ బంపెఁ దపముం
గుదియింపఁగ నంచు నెంచుకొని ముని యంతన్

క. పశ్చాత్తప్తుం డై యా
దుశ్చరితాసక్తిఁ దొలఁగఁ ద్రోచి విరక్తిన్
నిశ్చలతపశ్చరణకృత
నిశ్చయుఁడై యునికి గనివనితముని యెదుటన్.

క. శాపభయాపరిమేయద
శాపరవశ యగుచు ననిలచాలితలతికా
రూపంబున వణఁకుచు సం
తాపంబున నుండఁగా నతం డతులవయున్.

క. తెలియకవే నాపయి దయ
మఱవకువే యుభయవాంఛ మనవికి నైవా
తెలియకవే నను నమ్మిన
తెలివకు వేదన ఘటింపఁ దివురుదువె కటా!

క. నా కోఁకోరిక గల దది
చేకూఱుటకొఱకుఁ గఱకుశీలంబున ని
ష్ఠైకాగ్రసమగ్రమతిం
గైకొంటిని దపము మచ్చెకంటీ యిచటన్.

మ. అనుచున్ ము న్నను నీవు గూడునపు డే
నంటిం గదా వింటె యా
పనికై తాపసరూఢి కోరిచి తపో
భారం బుదారంబుగా
నొనరింపన్ సమకొంటి నీ వరుగు హా
స్యోత్కర్షముం జెంది యో
వనజాక్షీ! హరి సాక్షిగాఁ బలికితిన్
వైకల్యముం బొందకే.

క. అని యనిమిషగణికామణి
ననిచినదయ ననిచి గాధినందనుఁ డంతన్
ధనదాశకుఁ బరమతపః
కనదాశ కుదుర్పడంగఁ గడువడిఁ జనియెన్.

మ. చని కాంచెన్ మునిపంచవక్త్రుఁ డతిచం
చన్నిర్ఝరవ్రాతపా
తనితాంతోద్ధతశీకరప్రకరశాం
తశ్రాంతి నాఖేటకా

టనశీలాటవికప్రకల్పితధను
ష్టంకారబిభ్యన్మృగ
స్వనవాచాలము నుత్తరం బనుమహా
శైలంబు నాభీలమున్.

క. ఆపర్వతరాజంబున
మీపమున నభంగభంగమేదురగంగా
రూపగ యగు కౌశికి యను
నాపగతీరమున ఘనవనాంతరసీమన్.

క. ఘోరంబుగాఁ దపంబును
బ్రారంభించె నిగృహీతపంచేంద్రియసం
చారుం డై నిర్ముక్తా
హారుఁ డయి వియచ్చరులకు నచ్చెరు వొదవన్

సీ. వేయువత్సరము లీవిధమున నత్యుగ్ర
తప మాచరించున త్తపసి కళికి
యింద్రాదిదివిజుల్ మునీంద్రులుం బద్మజు
కడ కేఁగి తత్తపం బుడుపు మనుచు
వేఁడుడు వారలుం దోడన రాఁ జతు
రాస్యుఁ డమ్మునికడ కరుగుదెంచి
యతనిచేఁ బూజితుం డై తాపసోత్తమ!
చేరె మహర్షిత్వసిద్ధి నీకు

తే. హర్షి వై యుండు మనిన బ్రహ్మర్షి భావ
మి మ్మనిన నింద్రియజయం బొకింత నీకు
వెలితి యై యున్న యది యని పలికి పలుకుఁ
గలికి ప్రాణేశ్వరుఁడు స్వలోకమున కరుగ.

వ. వెండియు నా గాధేయుం డఖండతపోధురం
ధరుం డగుటయు.

తే. సకలభూచరఖేచరాశ్చర్యకరణ
ధుర్యచాతుర్యతత్తపశ్చర్య యరసి
ధైర్యబల మేది బలభేది తనపదంబుఁ
గోరునో యీతఁ డని మీఱునారటమున.

క. రంభఁ బిలిపించి తద్దయు
సంభావన చేసి మృదువచనరచనల నా
యంభోజానన కిట్లను
దంభోళి నవార్య మయినతనవెత దోఁపన్.

క. రా రావే మామకభయ
భారావేశము నెడల్పఁ బాల్పడఁగదవే
యోరంభా! క్రతుసాధ్యవ
రీరంభా! త్రిదశకుశలకృతిసారంభా!

మ. వనితా! యే మని తాల్మిఁ బట్టఁగల వి
శ్వామిత్రమానీశ్వరుం

డు నిలింపప్రతతుల్ చలింప నతిచం
డుం డై యకృత్యంబులే
తనకుఁ గృత్యము లంచు నిత్యమును న
త్యంతంబు నవ్యక్తదు
ర్వినయత్వంబునఁ బర్వి నా కొసఁగె ని
ర్విణ్ణత్వ మెంతేనియున్.

సీ. చండాలుఁ బంచె నుద్దండుఁ డై సశరీర
నాకసౌఖ్యముఁ జెంద నాదుకడకు
ననుచితం బని వాని నడుగునఁ బడఁద్రోవ
నభినవస్వర్గక్రియకుఁ దొడంగె
నాదెస మాన్పఁబో నతని కాకసమున
నసమదివ్యసుఖంబు లొసఁగఁ జేసె
మావాశికడఁ ద్రోచి మంత్రించి తనియించెఁ
గడఁగి శునశ్శేఫుఁ గావఁ గోరి
యంతఁ దనియక మఱి యెంత కెచ్చనో ని
రంతరదురంతనిష్ఠఁ గొఱంత లేని
నేర్పున సదర్పతఁ దపం బొనర్పసాగె
నాతి! నా కాధి గా గాధినందనుండు.

క. ఏకతమున నీ వెఱుఁగని
దేకతమున నైన నతని నీడ్చి విటులలో

నేకతముఁ జేసి కైకొను
మేకతమున నీకతమున నే సుఖ నొందున్.

తే. వింటివా నీరజాక్షి! నావంటివాని
యార్తి మాన్పుట కీర్తి నీ వంటి వానిఁ
గరఁచి పూవింటివానిపోకలకు లోను
పఱచి నీయింటివానిఁగాఁ బడసికొమ్ము.

చ. అన విని వేల్పుతేని కను
నంబురుహానన వింతదాననా
నను నుపచారచాటువచ
నంబుల వేఁడఁగ నీదుపంపుతో
వను జనుకాంత నింతబల
వంతపువంత పునఃపునస్స్థితిఁ
బెనఁగొన నున్ననీకు ధృతి
పెం పొనరింపుట పాడియే కదా.

క. పనిచియుఁ బనుపక మున్నగఁ
జని యాపని తీర్చి వచ్చుచానను గానా
విను మైన నొక్కవిన్నప
మనఘా! మునితిలకునలుక కళుకఁగవలదా?

క. కోపనిశాంతుం డాముని
శాపనిపాతమున కోర్వఁజాలుదు నే నే

సీపని కోపనిదానక
దాపసిదాన మగుపనికిఁ దగునె చొరంగన్.

తే. భోగవాసన వాఁ డేల పూను వేల్పు
నాగవాసమునం దున్ననన్ను నేల
నాగవాసములోఁ గూల్ప నాకభిక్షు
వేగ వాసవ! నీ వేఁగి వేఁడు మతని.

చ. చిలుకను బెంచి పిల్లి కెర
సేయువిధంబున నింత కాల మిం
పలవడఁ బ్రోచి నేఁ డతిభ
యంకరకౌశికకోపవహ్నిలో
పలఁ బడు మంచు న న్నెటులు
పంచెదు మేనక యూర లేదె యా
కలికి నె పంపరాదె యది
గాదె యెఱుంగుఁ దదంతరంగమున్.

మ. అన నింద్రుం డను రంభతోడ నిది జా
డా నీకు మా ఱాడ నే
మని నో రాడె మిటారిచేడె వని ని
న్నామానిపంచాననేం
ద్రుని సాధించఁగఁ బంచ నీవు మఱియో
ర్తుం బంచుకొ మ్మంచు న

న్ననుశాసించుట నాతి! నీతియఁటె జం
భారాతి యేఁ గానఁటే.

క. నిను మేటి వంచుఁ బంచిన
పని మాటలనూటి మీటి పాటించెదుగా
మునికోపము మఱి సుత్రా
మునికోపం బింతయల్పము గదా ముగుదా!

క. నిను నేఁ బనిఁ బంచిన న
న్నో నీవు పంచెదవు ప్రభుత నీదో నాదో
మనల నిరువురను భీరుతె
యనిపించెను దత్తపోమహత్త్వం బకటా!

తే. తత్తపోవహ్ని నీపయోధరము లార్చు
నాపయోధరముల నారునా మహాప్ర
తాపయోధరణోద్ధతిం దలఁగ దీవ
ప్రాపయోధరవైరి కీపాటు దగునె?

క. విసువక సుమసాయకుఁ డొక
దెస నే నొకదెసగ రెండుదెసలఁ నీతో
మసలక వచ్చెద మీఁక సకి!
నుసలక మఱి నామనసు ననుసరింపఁగదే.

మ. అని నిర్బంధము చేయునింద్రునిమనో
వ్యాసంగముం గాంచి యం

గన యెట్లుం గడవంగరానివిధిసం
కల్పం బనల్పంబు గా
యనుచున్ జి త్తముచేవ దెచ్చుకొని దే
వా! యింత నీ వాన తి
చ్చిన నే నే మనుదాన నట్లు చని నా
చే నైనచందమ్మునన్.

శా. ఆగాధేయు మనోజమాయలకు డా
యం జేయఁగాఁ బూనెదన్
వేగన్ నీవును బంచబాణుఁడును నా
వెన్నాసగా రండు నా
ప్రాగల్భ్యంబున మౌని లోఁబడిన నా
భాగ్యంబు గాదే యదే
యాగశ్చింతగ నాతఁ డల్గినను నీ
కై తత్ఫలం బందెదన్.

క. అని పలికి కలికి భూస్థలి
కనుఁగుఁజెలులు ప్రణయపూర్తి ననువర్తింపన్
జనుదెంచి కౌశికతపో
వనిఁ గాంచి విలాసవైభవసమంచిత యై.

శా. ప్రాణాపాననిరోధనాధికతపో
భాసిన్ మునిన్ డాసి ని

ద్రాణవ్యాఘ్రముఁ దట్టి మేల్కొలుపుచం
దం బొప్పం బత్నింముఖ
శ్రోణిఁ దానును జెల్మికత్తె లగుసు
శ్రోణుల్ ప్రవీణాత్మలై
వీణా మర్దళతాళనిర్భరరవా
విర్భావముఁ జూపినన్.

మ. పరమైకాగ్రనిజాంతరంగదశకుఁ
భంగం బాసంగం గడుఁ
దిర మై యానిన యానినాదమున సం
దీప్తాగ్రహోదగ్రుఁ డై
త్వర హెచ్చంగను విచ్చి యచ్చెలుల సం
దర్శించి మీ రెవ్వ రిం
దఱు దేరఁ గత మేమి చెప్పుఁ డనఁగా
నారంభ యమ్మౌనికిన్.

మ. చెలులుఁ దానును మ్రొక్కి లేచి వినయ
శ్రీ యుల్లసిల్లం గృతాం
జలి యై యి ట్లను నోతపోధనవతం
సా! రంభ యం డ్రాఖ్య నా
చెలు లీచందనగంధు లిందఱును నీ
శృంగారలక్ష్మీసము

జ్వాలసౌందర్యముఁ జూచి నీచరణసే
వాసక్తి దైవాఱఁగన్.

ఉ. వచ్చినదాన నీవన ని
వాసము నింతతపఃప్రయాసముఁ
దెచ్చినసత్ఫలంబుగ ర
తిన్ నిరతిన్ నను నేలుమయ్యా! నా
ముచ్చట దీర్పుమయ్యా! యొక
ము ద్దివు డియ్యఁగదయ్యా! క్రీడలన్
మె చ్చొదవింతునయ్యా! దయ
మించుగ నుంచఁగదయ్యా! నాపయిన్.

క. అని చేర రాఁగ ముని యను
ననుఁ జేరకు ఱాఁగ! యేఘనతపంబున నా
మనసుపొగ రాఁగఁ గదియం
జనునె తపోగ్నిఁ బొగ రాఁగ సరసఁపుఁగొమ్మా!

ఉ. వాసవుఁ డంప నిచ్చటికి
వచ్చితి వింతియ కాక నన్ను నీ
వాస వరించ వచ్చితె జి
తాత్మ ననున్ గికురించి మాయ నీ
వాస వరించ వచ్చితి వ
నంగునిపోకలఁ ద్రోవ రా ననా

యాసతఁ గావరాన నను
నంటఁ దలంచితె యోవరాననా!

క. నీ విటు వచ్చుట నన్నుఁ
నీవిటుఁ జేయుట కెఱుంగనే నీమాయల్
నీవిహరణ మేఁ గోరఁ
నీవిహరణ మెట్లు గోర నేర్తుఁ జెపుమా.

క. నీలీలోదయముం గని
నీలీ! లో దయఁ దలంతునే కలనేనిఁ
శైలి వయి తూలి యుండుము
నాలివగల్ గట్టిపెట్టి నాశాపమునన్.

చ. అన విని గుండె ఝల్లు మన
నంగన యంగము లెల్లఁ గ్రుంగ న
మ్మునిపతిపాదపద్మయుగ
ముఁ దనఫాలముఁ జేర్చి యెట్టులై
నను నపరాధినిఁ నను న
నాథను సత్కృపఁ జూచి శాపబం
ధనమును ద్రోవఁ ద్రోవ ముని
నాయక! నీవ వచించి కావవే.

సీ. అని దీనదీన యై యన్నలినానన
దా నన దాన ననూనకరుణ

పొడమినఁ బరమతపోనిశ్చలబ్రాహ్మ
 ణానుగ్రహంబున నది దొలంగు
ననిన శాపముఁ బూని యామానినీమణి
 శైలి యాటయు వయస్యలును మరలి
సురపురి కరిగి రుత్తరదిశాతప మంతఁ
 జాలించి పూర్వదిశాతటంబుఁ
జేరి మౌనవ్రతము నిరాహారతయును
నింద్రియవినిగ్రహంబు నెంతేనిఁ బూని
మౌని యసమాన మౌనియమంబుతో న
కంపితధృతిం దపం బొనరింపసాగె.

క. ఆయుగ్రతపోభరమున
వేయేండ్లటు లున్నఁ జూచి విస్మయయుతుఁడై
తోయజభవుఁ డరుదెంచిన
నాయమి వందనముఁ జేసె నాయన కంతన్.

క. అతనిఁ గనుంగొని యిటు లనుఁ
జతురాననుఁ డింకఁ దపముఁ జాలింపు దృఢ
వ్రత! బ్రహ్మర్షిత్వము వి
శ్రుతముగ సాధించితివి విశుద్ధచరిత్రా!

మ. అనినన్ ధన్యుఁడ నైతి నీకతన నా
 యాయాసముల్ దీఱె నీ

వనిన ట్లింక వసిష్ఠమానియును బ్ర
హ్మర్షిత్వవంతుండ వై
తనికం గాని మదంతరంగమునకుఁ
హర్షంబు గానేర దా
పనియుఁ సేవ ఫలింపఁ జేయఁగదవే
బ్రాహ్మీమనోవల్లభా!

సీ. అని ముని తను వేఁడుకొనిన వాణీనేత
దనమనమున వసిష్ఠునిఁ దలంప
నతఁ డరుదేర నుదారతదావాధ
న మొనర్చి గాధినందనుఁడు వినయ
మున నున్నఁ దనవెంటఁ జనుదెంచియున్న దే
వర్షిసత్తములు బ్రహ్మర్షివరులు
విన విధాత వసిష్ఠమునిఁ జూచి పరమ త
పోధికుం డైన యీగాధిసుతుఁడు

పడసె బ్రహ్మర్షిభావ మప్రతిమమహిమ
నీవు బ్రహ్మర్షి వనినఁ గా కేవిధమున
నేను జెప్పిన నియ్యకోఁ డితనిమనసు
కుదురుకొల్పు వసిష్ఠ సద్గుణవరిష్ఠ!

వ. అనిన నతం డి ట్లనియె.

క. కామక్రోధాపగమ
క్షేమకుఁడు జితేంద్రియుఁడు శుచిస్వాంతుఁడు తే
జోమండనుఁ డీమునిచూ
డామణి బ్రహ్మర్షియే దృఢవ్రతుఁ డగుటన్.

క. అని దేవర్షి బ్రహ్మ
ర్షి నలినసంభవులు వినఁ బరిస్ఫుటముగఁ బ
ల్కిన మునివచనము సత్యం
బని ఘోరన గగనవాణి యభినందించెన్.

క. సురదుందుభినినదం బం
బరమునఁ బర్వెను సుపర్వపాదపపుష్పో
త్కరవర్షసముత్కర్షము
పరఁగ సకలభూతములు శుభంబని పొగడెన్.

చ. అటులు కృతార్థుఁ జేసి కుశి
కాత్మజు నబ్జభవుండు దేవతా
పటలవరుల్ వసిష్ఠముఖ
భవ్యతపోధనమండలేంద్రు లం
తట నతఁ డంపఁగాఁ దమప
దంబులకున్ జని రమ్మహాత్ముఁ డి
జ్జటికులసార్వభౌముఁడు వ
శంబె నుతింప నిదంప్రభావమున్.

క. అనుచు శతానందుఁడు దె
ల్పినఁ గౌశికుమహిమ విని యభిష్టుతి నతనిఁ గ
దనిపిరి దశరథసుతుఁడును
జనకుఁడు సభ నున్నసకలసజ్జనవరులున్.

క. శ్రీయుఁ జిరాయు వరోగత
యాయతకీర్తియు బలంబు హస్తగతము తా
నేయెడ జనులకు నీ గా
ధేయోపాఖ్యానమును జదివినఁ వినినన్.

క. కామాంబాచిన్నప్రభు
సోమతపస్స్త్రమపాక సుశ్లోక సము
ద్దామవివేక సదాకరు
ణామధురాలోక లోకనంద్యాలోకా!

మ. నరలోకస్తవనైకపాత్రశుభనా
నాభోగ నాభోగ హృ
త్తరళీకారిరణారిమందిరితకాం
తారాగ తారాగణే
శ్వరదుగ్ధార్ణవకర్ణసాత్కృతనిరా
సత్యాగసత్యాగమ
స్ఫురితన్యాయసమార్జితోర్జితభుజా
భూయోగ భూయోగజా.

భుజంగప్రయాతము.

అవార్యస్ఫురౌదార్య యార్యాశ్రయాహా
ర్యవర్యా సుచర్యాసమావాస ధీవా
సవాచార్య శౌర్యా నుమంగీ వరాంగీ
నవీనస్మరా వంకినారాయణాంకా.

పృథ్వీవృత్తము.

సమిద్ధనయపద్ధతిశ్రయణశుద్ధ సిద్ధాంగనా
సమృద్ధనుతిబద్ధభాస్వదని రుద్ధసద్ధర్మని
స్సమోద్ధవమదోద్ధతాశయ విరుద్ధభూభృద్ధను
స్సముద్ధురసమిద్ధరాజయనసిద్ధతత్త్వద్ధనా!

గద్యము.

ఇది శ్రీమద్వామదేవసేవాహేవాకప్రభావా కలితలలితకవితావైభవ లింగనకవితనూభవ నిరంతరతత్త్వచింతనానంతనార్యప్రణీతంబైన శృంగారగాధేయోపాఖ్యానం బను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము

సంపూర్ణము.

# శృంగార గ్రంథములు.

---

శృంగార రాధామాధవము. 2—0—0

శృంగార అహల్యా 2—0—0

శృంగార మల్హాణచరిత్ర 2—0—0

శృంగార భల్లాణచరిత్ర 2—0—0

శృంగార సావిత్రీచరిత్ర 2—0—0

శృంగార సత్యభామా సాంత్వనము 3—0—0

శృంగార రసాలవాలము 1—0—0

శృంగార కాళిదాసు కథలు 1—0—0

శృంగారము 0—4—0

మిస్ మేయో గ్రంథఖండనము

1—0—0

కృష్ణ పక్షము 1—8—0

పరా:—శృంగారగ్రంథమాల చందాదారులకు ప్రత్యేకపుధరలు. శృంగార గ్రంథమాల తరపున ప్రాచీనశృంగార గ్రంథములే కాని యితర గ్రంథములు ప్రకటింపఁబడవు. ఆంధ్రదేశమున నిట్టి గ్రంథము లింతవఱకు వెలువడలేదని గట్టిగఁ జెప్పఁగలము. మరియు మద్రాసులో లభించుగ్రంథములు మాకు వ్రాసినచో వీ. పీ. గా పంపఁబడును.

మేనేజరు:—

జి. ఎస్. శాస్త్రి అండు కో,

తెపాలపెట్టై నెం 110 రు,

మద్రాసు.